# పిల్లల కథలు

**Part III**

ROWJEES PRESS, ADONI.

1930.

# చాతుర్యపు సిద్దప్ప

ఒకయూరిలో నొక వైశ్యుడుండెను. అతడు చాలాబీదవాడు. అతనికి ముగ్గురు కుమారులుండిరి. పెద్దవాడు ఎద్దప్ప. నడిపివాడు మొద్దప్ప. చిన్నవాడు సిద్దప్ప. పెద్దవాడుబలశాలి. నడిపివాడు నల్లనిస్థూలదేహి. చిన్నవాడు చురుకుదనముగలవాడు. ఈ అన్నదమ్ములు కొన్నియేండ్లవరకు తండ్రియొక్క సంపాదనతోనే జీవితముగడపిరి.

కొన్ని సంవత్సరములయిన తరువాత, శెట్టి ముసలివాడాయెను అతడు మొదటివలె సంపాదించ లేడు. ఒకదినము అతడు తనకుమారులను పిలిచి, "నేను ముసలివాడనైతిని. ఇంక మీరు చేతనయినంత పనిచేసి ద్రవ్యమును సంపాదించండి ఇంతవరకు మిమ్ములను నేను సాకలేదా? ఇంక ముందు మీరు నన్ను సాకండి." అనెను.

ఎద్దప్ప, మొద్దప్ప, సిద్దప్ప, ,,అటులనే చేసెదము" అనిరి.

మరునటి దినము తెల్లవారిన తర్వాత, ,,ఏదైనపనిని చూతము" అని ముగ్గురుఇంటి నుండి బయలు దేరిరి.

అప్పుడు ఎద్దప్ప, ,,మనమెక్కడికి పోద ము" అని మిగిలినవారిని అడిగెను.

మొద్దప్ప ,,ఎక్కడికైనా పోవలెకదా? ఎక్కడికో! ఎవరికి తెలియును?" అనెను.

సిద్దప్ప ,,నేనురాజనగరకు పోయెదను" అనెను. అతనిమాటకు అన్నగారు, ,,ఓరే! సిద్దా, రాజుఅనగానేమి అని తెలియనినీవు రాజుఇం టికి పోదువా!" అని ఫక్కుమని నవ్విరి.

,,రాజునగరు ఎంతో పెద్దది. అక్కడ కావలసినంత పనియున్నది. అక్కడికిపోతే మన కందరికి పనిదొరకును. ఆఇల్లు మనవెనురుస్థంభ

ములు, గడ్డికప్పు, మంటినేలయుండు గుడిసె కాదు. అదొక పెద్దది. కదిపదారువాకిండ్లు! నూరారుకిటికీలు! రత్నాలస్తంభములు! బంగారుగోడలు! వెండిదూలాలు! తెలియునా? నేను అక్కడికి పోయెదను" అనిసిద్దప్ప అనెను.

"నీవు అక్కడికిపోయి ఏమిపనిచేసెదవు? అని మొద్దప్ప అడిగెను.

"రాజునగరమునెదురుగా ఒక పెద్దమఱ్ఱిచెట్టుగలదు. అదిపెద్దదిగాపెరిగి ఇంటిలో చాల చీకటి అయినది. దానిని నఱికిపడవేసినఎడల, మూడు సంచులరూపాయలు ఇచ్చెదరట. నేను ఆచెట్టును కొట్టిపడవేసెదను. రూపాయలు తెచ్చెదను. పెండ్లిచేసికొనెదను. ఇల్లుకట్టించుకొనెదను" అని సిద్దప్ప చెప్పెను.

"నాకంటెముందుగానీవు ఈపనినిచేసెదవా?" అని ఎద్దప్పఅడిగెను.

"నేను మొదలు దానిని నటుకకున్నగదా నీవు నటికెదవు?" అని మొద్దప్ప చెప్పెను.

అట్లనేకాని, మనము ముగ్గురు అక్కడికిపోద ము." అనిసిద్దప్పచెప్పగా ముగ్గురు రాజనగరు వైపు, అడవిలోనడచిపోయిరి. ఎద్దప్ప, మొద్దప్ప అటుఇటు చూడక, చేతులనునడుముమీాద నుం చుకొని నడచిరి. సిద్దప్ప అటుఇటు చూచుచు ముందుపోయెను; ఇక్కడేమి? అక్కడేమి? అని విచారముచేయునదే సిద్దనిపని.

త్రోవలోదట్టముగా ఊతచెట్లు. పొదలలో పూలు. పూలమీాదపురుగులు. చెట్లనుపూలను, పురుగులనుచూచుచు నడచునదేసిద్దనిపని. మిగిలి నఇద్దరికి ఊరకే నడచుటేభారమాయెను. వారి ద్దరు,— "ఏమి చేయవలెను? అంత దూరము పోయి, అంతకఠినమైనపని చేయవలె గదా?—ఊఁ—"అనుచు పోయిరి.

సిద్దప్ప ప్రతిపదార్థమును గమనించుచు,

„ఏమిది? ఎందుకిది? ఏలాగిది" అని వారిని విచారించుచు పోవుచుండెను. వారు, „అదంత మాకు తెలియదు! అనుచు పోవుచుండిరి. ఇతడు అటులనే అడుగును. వారటులనే చెప్పుదురు.

ఇట్లనే కొన్ని మైళ్ళు ముందుకు నడచిపోవుచుండ, అక్కడ అడవి దట్టమై పెరిగినట్లు తెలిసెను. అడవిలో గొడ్డలితో కొట్టినట్లు శబ్దము, కొమ్మలు విరిగిపడు శబ్దము, వినవచ్చుచుండెను.

„ఏమిది? ఎందుకిది? ఏలాగిది?" అని సిద్దప్ప తన అన్నగారి నడిగెను.

„అదంతా మాకు తెలియదు! గొడ్డలి శబ్దము వినబడదా?" అని వారనిరి.

„ఆశబ్దమేమి? అది ఎందుకు? అది ఎటుల? ఇదంత తెలియక నేను ముందుకు నడువను" అని సిద్దప్ప చెప్పెను.

„పోవయ్యా, ఛీ! కావలసినదంతా చూచిరా. గొడ్డలి చూచుటకింత పరుగెత్తవలెనా? అందుకే నీవు సిద్ధ” అని అన్నగారు చెప్పి అక్కడ నిలువకుండా ముందుకు నడిచిరి. సిద్ధప్ప గొడ్డలి శబ్దము వైపు పోయెను. అతడు కొండయెక్కి కొంత అవతలి వైపు చూడగా అక్కడ ఏమి చూచెను? తెలియునా!— అక్కడ ఒక పెద్ద ఉక్కు గొడ్డలి ఒక రావిచెట్టును నఱుకుచుండెను. దానిదగ్గర ఎవరును లేరు.

„గొడ్డలీ! గొడ్డలీ! ఆ రావిచెట్టును నీవు ఒంటరిగా నఱికి, నఱికి, నీకు వేసరిక పుట్టలేదా?” అని సిద్ధప్ప అడిగెను.

„అయ్యా! మహారాజా! నీవిప్పుడు వచ్చితివి. నీకొఱకు వేచియుంటిని.” అని గొడ్డలి చెప్పెను.

„రా, గొడ్డలీ! రా” అని సిద్ధప్ప పిలచెను. ఆ గొడ్డలి వచ్చెను. దానిని అతడు తన అంగి జేబు

సందించుకొనెను.

అక్కడినుంచి, సిద్ధప్పపరుగిడి, పరుగిడి తన అన్నగారిని వెంబడించెను. వారు, "ఏమిచూచితివి, సిద్ధా!" అనిరి.

"అదొకగొడ్డలేకదా! అక్కడ చెట్టును నఱుకుచుండెను" అని సిద్ధడు చెప్పెను.

"మేము ఊహించలేదా? మాతో కూడవచ్చియుంటే, ఇంతపరుగిడ వలసియుండెనా?" అనివారిద్దరు అతనిని హాస్యముచేసిరి.

"కాని, చూడవలసినదానిని చూచితిని, చేయవలసినది చేసితిని." అని సిద్ధప్ప ఊరకుండెను.

అటులనేవారు ముందునడచు చుండగా ఎక్కడనో నేల త్రవ్వినట్లు శబ్దమువినవచ్చెను.

"ఏమిది? ఎందుకిది? ఎటులిది?" అని సిద్ధప్ప అడిగెను.

"అదంతా మాకు తెలియదు. గుద్దలి శబ్దము వినలేదా? అని వారిద్దరు చెప్పిరి.

"ఆశబ్దమేమి? అది ఎందుకు పుట్టినది? అదెట్లు? ఇదంతా తెలియక నేను ముందుకునడచుటలేదు." అని సిద్ధడు చెప్పెను.

"పోప్పా, పో! కావలసినదంతా చూచిరా గుద్దెలిసి చూచుటకింతపరుగెత్తవలయునా? అందుకే నీవుసిద్ధ" అని అన్నగారు చెప్పిరి. అక్కడనిలువకుండ ముందుకుపోయిరి. సిద్ధప్ప గుద్దలిశబ్దపువైపునకుపోయెను. అతడు కొండయెక్కి, అవతలి వైపుచూడగా, అక్కడ అతడేమిచూచెనో తెలియునా?

అక్కడ ఒక ఉక్కుగుద్దలి ఒక బండను కొట్టుచుండెను. దానివద్ద ఎవరును ఉండలేదు.

గుద్దలీ! గుద్దలీ! ఆబండను నీవు బంటరిగా కొట్టి, కొట్టి, నీకు వేసరిక పుట్ట లేదా?" అని సిద్ధప్ప అడిగెను.

అయ్యా, మహారాజా! నీవిచ్చుడునాకు ఒడయము నీకొఱకై వేచియుంటిని" అని గుద్దలి చెప్పెను.

"రా. కూలిచేసేగుద్దలీ! రా," అని సిద్ధడు పిలిచెను. గుద్దలివచ్చెను. దాని నతడు తనపెకము జేబిలో నుంచుకొనెను.

అచ్చటి నుండి అతడు పారిపోయి కొంత దిగి తన అప్ప గారిని చేరెను. వారు "ఏమి చూచితివి సిద్ధా?" అని అడిగిరి. "అదొక గుద్దలి అంతే, అక్కడ బండను కొట్టు చుండెను" అని సిద్ధడు చెప్పెను.

".మేము మొదలే చెప్పలేదా? మాతోనే వచ్చియుంటే ఇంతపరుగిడు చుంటివా?" అని వారిద్దరు వానిని పరిహాసము చేసిరి.

"కాని, చూడవలసిన దానిని చూచితిని. చేయవలసిన దానిని చేసితిని" అని సిద్దప్ప ఊర

తుంచెను.

అప్పటికే సూర్యుడు సరిగా నెత్తి మీదికి వచ్చెను. వారు ఒక కాలువ దగ్గరకు వచ్చిరి. కాలువలో నీళ్లుచల్లనివి. గట్టుమీద పచ్చని గడ్డి. నీళ్ళలో చిన్న చేపలు. అడుగున సన్నని ఇసుక.

వారు ముగ్గురు నీళ్లను త్రాగిరి. గడ్డిమీద హాయిగ పండుకొనిరి.

"ఏమిది! ఎందుకిది? ఏలాగిది?" అనిసిద్ధుడు తన అన్నగారిని అడిగెను.

అదంతా మాకు తెలియదు. కాలువను చూడలేదా?" అనివారిద్దరు చెప్పిరి.

"ఆకాలువ ఏమి?" ఎందుకుపారుచున్నది? ఇదంతా తెలియకనే, నేను ముందుకు పోను " అని సిద్ధుడనెను.

"పోవయ్యా, పో! కావలసిన దంతా చూచిరా.

కాలువను చూచుటకు ఇంత పారకమా? పరుగెత్త
వలెనా? అందుకే నీవు సిద్దన్న” అని అన్నగారు చెప్పి
అక్కడ నిలువక ముందుకు వెళ్ళిరి. సిద్ధుడు కాలువ
పుట్టుచోటికి పోయెను. మైదానముదాటి కొండ
ఎక్కి, ఆవ తలి వైపుదిగి, అక్కడ ఒక అర
చేయ్యంత వెడల్పయిన ఆకాలువలో దిగి చూ
డగా, అతడు ఏమి చూచెనో తెలియునా?

అక్కడ ఒక చింత పిచ్చపగిలి లోపలినుంచి
నీళ్లు పారుచుండెను. దాని దగ్గర ఎవ్వరును లేరు.

„పిచ్చా! పిచ్చా! ఒంటరిగా నీరు పారించి,
పారించి నీకు వేసరిక పుట్ట లేదా?” అని సిద్ధడు
అడిగెను.

„అయ్యా యజమానుడా, నీవిప్పుడు
గొప్పవాడు. నీకొరకై కాచుకొని యుంటి” అని
చింత పిచ్చ చెప్పెను.

„రా, చింతపిచ్చా! రా,” అని సిద్దప్ప పిలి

చెను. చింతగింజను తన అంగీపై జేబునందుంచు కొనెను.

అక్కడి నుంచి ఆతడు పారి పారి వచ్చి, కొండదిగి, బయలును దాటి, తన అన్న గారిని చేరెను. వారు "ఏమి చూచితివి, సిద్ధా?" అనిరి. "అదొక పిచ్చి, అంతే, అక్కడ నీళ్లు పారు చుండెను." అని సిద్ధుడనెను.

"మేము మొదలే చెప్పలేదా? మా వెంట వచ్చి యుంటే ఇంత పారు చుంటివా?" అని వారిద్దరు పరిహాసమాడిరి.

"కానిమ్ము, చూడవలసిన దానిని చూచితిని. చేయవలసిన దానిని చేసితిని." అని సిద్దప్ప యూరకుండెను.

అటులనే, వారు ముందుకు నడచి, నడచి, రాజ నగరు పెరటివద్దకు పోయిరి. అక్కడ పెద్ద అక్షరములతో ఈలాగు వ్రాయబడియుండెను.

ఈ రావి చెట్టును నలికి నట్ట
యితే, అర్ధ రాజ్యము దొరకును.
ఈ పెరటిలో ఒక బావి త్రవ్వితే,
అర్ధ రాజ్యము దొరకును.
ఇదే రాజు గారి ఆజ్ఞ

సిద్దడు దీనిని చదివెను.

ఎద్దప్ప దీనినివిని "వహావ్వా!" అని తల యూడించెను.

మొద్దన్న దీనినివిని "శబాస్" అని మీస ములు దువ్వెను.

"ఇదంతా సిద్దనిశ్లో అమ్మో వనులా!" అని ఇద్దరు నవ్విరి.

"మనము ఒక రోజుకే అర్ధ రాజ్యమును పొందెదము" అని చెప్పుచు మూర్తిని వస్తువు పెరటిలో పోయిరి. అక్కడ కూడా పెద్ద అక్షరములతో ఇటు వ్రాయబడియుండెను.

ప్రాణిని నఱుకుటకు వచ్చిన వారు నఱుక లేక పోతే, వారి చెవులు కోసి వేయబడును. బావి త్రవ్వుటకు వచ్చిన వారు, త్రవ్వ లేక పోతే వారి ముక్కు కోయబడును. ఇదే రాజు గారి ఆజ్ఞ

సిద్దప్ప దీనిని చదివెను.

ఎద్దప్ప దీనినివిని "వహావ్వా" అని తల యాడించెను.

మొద్దప్ప దీనినిచూచి ,,శభాష్" అని మీసములు దువ్వెను.

తర్వాత ఎద్దప్ప అక్కడి కావలి వారి నుంచి ఒక గొడ్డలిని ఇప్పించుకొనెను. అది చాలా బరువుగా నుండెను. దానిని కష్టముతో ఎత్తి, బలముతో విసరి, ఆ చెట్టు వేరును కొట్టెను. ఒక వేరు మాత్రము తెగెను. దాని వెంబడినే రెండు పెద్ద వేళ్లు పెరిగెను.

,,ఇంక నా చేతకాదప్పా!" అని ఎద్దప్ప చెప్పెను. అప్పుడు అక్కడి కావలి వారు వానిని కట్టి రాజు వద్దకు తీసికొనిపోయిరి. రాజు ,,రేవు ఇతని చెవులను కోసి వేయుండి" అని వుత్తరువు చేసెను.

మొద్దప్ప అక్కడి కావలివారి నుండి ఒక గుద్దలిని ఇప్పించుకొనెను. అది చాలా బరువుగా నుండెను. దానిని బలముతో ఎత్తి, గట్టిగా విసరి,

తప్పని ఆపెరటి నేలమీద వేసెను. అక్కడ ఒక అడుగు లోతు దిగెను. అయితే రెండు పెద్ద రాళ్లు అక్కడినుంచి లేచెను.

„ఇంక నా చేతకాదప్పా" అని మొద్దప్ప చెప్పెను అప్పుడు అచ్చటి కావలి వారు వానినికట్టి, రాజు వద్దకు పిలుచుకొని పోయిరి. రాజు „రేపు వీని ముక్కును కోయండి" అని ఆజ్ఞ చేసెను.

సిద్దప్ప అప్పుడు ముందుకు వచ్చెను." అయ్యా! నేను ఈ రెండు పనులను చేసెదను." అని రాజుకు తెలిపెను. రాజు „ఒరే, చిన్నవాడా! నీనుంచి కాదు." అని చెప్పి, „వీనిముక్కు, చెవులు ఇప్పుడే కోసి వేయండి" అని కావలి వారికి ఉత్తరువు చేసెను.

„మహాస్వామి! నేను ఆపనులను చేయ లేక పోతే అట్లనే చేయండి. వాటిని చేతునా? మహారాజా!" అని సిద్దప్ప ఆజ్ఞ వేడెను.

"ఊఁ - చూశాము - కానీ లే." అని రాజు ఉత్తరువు ఇచ్చెను.

సిద్దప్ప తన అంగి కుడి జేబు నుంచి గొడ్డలిని బయటకి తీసి,

ఓ పెహూ — గొడ్డలి
ఊకూ — గొడ్డలి
చెట్టు - బుడమును
ఏటు — కొట్టని
ఫెళ ఫెళ — కూల్చని
క్రిందికి — దుంగని

అని పాడెను. ఇంతలో ఆ గొడ్డలి ఇటు అటు పైన క్రింద కుడి ఎడమ, గిర గిర మని తిరుగుచు, ఫట్ ఫట్ మని కొట్టుచు చర్ చర్ మని నఱకుచు, అరక్షణములో దడ దడ అని ఆ మహా వృక్షమును నఱకెను. అది ఫెళ ఫెళ మని నేలకు కూలెను. పడినకొమ్మలు, వేళ్లు, తునకలై

తాామే మూట గట్టు కొని పెరటిలో ఒక వైపు చేరుకొనెను.

„స్వామీ! చెట్టును కొట్టితిగదా! ఆజ్ఞ" అని సిద్దప్ప రాజునడిగెను.

రాజు „ఔను అర్ధ రాజ్య మియ్యవచ్చును. అయితే బావినిత్రవ్వ లేదుకదా? నీముక్కు కత్తిరించెదను" అనెను.

„ఆబావిని ఎక్కడ త్రవ్వవలెనో ఆజ్ఞ కావింపు" అని సిద్దప్ప రాజునుఅడిగెను.

„అక్కడనే, నీవు నిలుచున్న చోటనే" అని రాజు ఆజ్ఞఇచ్చెను. అప్పుడు సిద్దప్ప తన ఎడమ జేబులో నుండి గుద్దలిని బయటికి తీసి ఇట్లు పాడెను.

ఓహోహో—గుద్దలి,
ఉక్కు —గుద్దలి

బావి—త్రవ్వకం.
రాతి—గుద్దలి.

అంతలో ఆగుద్దలి చుట్టు ముట్టును, కొట్టి త్రవ్వి, బండలను ముక్కలు ముక్కలుగా చేసి, సర సర మని ఈడ్చి ఈడ్చి అరక్షణములో బావిని త్రవ్వెను. పడిన మన్ను రాయి అమాంతట తామే రాజ నగరుచుట్టు గోడకట్టెను.

“స్వామీ! బావిని త్రవ్వితిని కదా! మీ ఉత్తరువు కావలెను.” అని సిద్దప్ప అడిగెను. “ఔను అర్ధ రాజ్య మియ్య వచ్చును. అయితే బావిలో నీళ్లు లేవే-రాజ్యము దొరకదు.” అని రాజనెను.

“ఎన్ని నీళ్లు కావలెనో తెప్పించెదను. దీని కేమి ఇచ్చెదరు” అనెను సిద్దడు. “నా బిడ్డనే ఇచ్చెదను” అనిరాజు మాటఇచ్చెను.

అప్పుడు తన అంగీపై జేబు నుండి సిద్దడు

చింతపిచ్చను పెరి డీసి

చింతపిచ్చా—రావే
గుంటలోనే—పోనే
క్షణములోన—నీవే
నీళ్ళు నింపు—కోవే

అనిపాడుచుండగనే చింత పిచ్చ బావిలోకి నీళ్లను నిండించెను. (అక్కడినుంచి నీళ్లు గుళగ్గుళు మని పారిబావి నిండెను ]

స్వామీ! బావిలో నీళ్లునించితిని. ఇంకే మైనావుంటే చెప్పండి" అని సిద్ధుడు చెప్పెను ,,జౌ ను మం చి దా యె ను. నీవు చెట్టు కొట్టిన దానికి రాజ్యము. బావితోడిన దానికి కర్ధ రాజ్యము. నీళ్లునించినదానికి నాబిడ్డ, ఇవి అన్ని ఇచ్చి ఈరాజ్యము నీకు పట్టము గట్టెదను " అని రాజు పట్టాభిషేకమునకు, పెండ్లికి, యత్నము చేయుమని మంత్రితో చెప్పి దం డో రా

వేయించెను.

సిద్ధప్పకు, రాజుబిడ్డకు సంభ్రమముతో పెండ్లిజరిగెను. తర్వాత పట్టాభిషేకము చేసి కొని "ఒకదయుడు" అనిపించుకొనెను. తన అన్న గారిని చెరనుండి విడిపించెను. ముసలి తల్లితండ్రు లను పిలిపించుకొనెను. రాణి సమేతముగా రాజ్యమును బాగుగా ఏలెను.

కథకు కాళ్లు లేవు.
కోడికి పళ్లు లేవు.
ముంతకు చెవులు లేవు

# కొకొ—కో—కోడి పుంజు

ఒక కుమ్మరి వాడు ఒక కోడి పెట్టను పెంచుచుండెను. ఒక నాడది ఒక గుడ్డును పెట్టెను. కొన్నాళ్లకు ఆ గుడ్డు పగిలి ఒక చిన్న పుంజు బయటికి వచ్చెను. దానిని ఆకుమ్మరివాడు ముద్దాడెను. అది పెద్ద పుంజాయెను.

ఆ పుంజును పెంచుటకు కుమ్మరికి శక్తి చాలదు. వాడు చాల పేదవాడు. వాని కుండలన్నియు పగిలి పోయియుండెను.

పల్లెజాతర వచ్చెను. సంతకూడ వచ్చెను కుమ్మరి సంతకు పోవ సిద్ధమయ్యెను. అయిన వానివద్ద కుండలులేవు. పాపము! వాడేమి చేయగలడు? అయిన కోడి పందెమునకు పుంజు కలదు. దానిని తీసికొని, కుమ్మరి, త్వరలో తలకు శల్లా,

కాలుకు చెప్పులు, భుజముమీద వస్త్రము, దాని కొనలో బీగపుచెవి, తలమీద చిన్న పూలదండ, నోటిలో వక్కాకు వేసుకొని, కాళ్ళ చెప్పులు గిర్ గిరుక్కు మనుచుండ, మీసములు దువ్వుచు ఎంగిలి ఉమియుచు, అట్టహాసముతో సంతకు వెళ్లెను.

ఈపుంజు సంతలో ఎనిమిది పది పుంజులతో, గెలిచినది. "కుమ్మరి పుంజు" అని కీర్తి వచ్చెను. ద్రవ్యము వచ్చెను. కాన కుమ్మరికి ఆపుంజు మీద ప్రీతి హెచ్చెను అప్పటినుండి ఆపుంజుకు "పందెపు పుంజు" అను ప్రతిఖ్యాతి వచ్చెను.

జూదపు పుంజు ఒకనాడు నేలను కాలితో త్రవ్వి తినుటకు ఏమైన దొరకునేమో యని చూచుచుండెను. పురుగు, గింజ, దొరికిన పుంజు తినును. నాణ్యములు, వజ్రములు చిక్కిన కుమ్మరికిచ్చును.

ఒక నాడా పుంజు ఆహారార్థమై వెదుక, దానికొక మణిదొరికినది. ఇదినాదికాదు. నాకు వద్దు" అని దానిని ముక్కుతో కరచుకొని, "ఇది ఎవరిది? ఇదిఎవరిది?" అని ఎదురు పడిన వారి నందరిని అడుగుచుండెను.

అప్పుడే గొరవయ్య కొండ నుండిదిగి, రాజుగారి ఇంటికి పోవు భైరవరాజ కుమారుడు ఆపుంజును చూచెను. ఇతను ధనికుడు. ఇతని ఇంటియందు, బంగారు ఏనుగులు, వెండి గుర్రములు, వజ్రపు ఎద్దులు, రత్నాలరథములు, పగడాల పల్లకీలు, ముత్యముల ముంగురులు గల దాసీలు ఉండినవి.

'ఏనుగులు గుర్రములు నీరు త్రాగుటకు చక్కని చెరువులుండెను. మేయుటకు పచ్చని పొలములుండెను. ఆ రాజ కొమారుని ముందు యింపైన మేళములు, సొంపైన బ్యాండు వాద్యములు, పొడుగైన కర్రలతో అని కూయు కొమ్ము

టప టప యని కొట్టుటకు తప్పట్లు, ఝామ్ అని జాండాలు, చల్లగా విచు చామరములు, దీపము వెలిగించు దీవట్లు అన్నియు వుండినవి.

అతని వెంట సాటిలేని సైన్యము కూడ కలదు. అతడు పగడాల పల్లిక్కిలో కూర్చొని యుండెను. అట్టిరాజ కొమారుని జూచి పుంజుకు నోరాడ లేదు. అయినను చాలా కష్టముతో ఆపుంజు-"కొ_కొ-కొ- ముక్కులో వున్నది-ఎ-ఎ-వ-రిది" అని అడిగెను.

భైరవుడు ఆ మాటలనువినెను. దాని మాతి యందున్న మణిని చూచెను. వల్లికిదిగెను. తానొక్కడేనిలిచెను. పరివారమంతయు ముందు నడచెను. అతడు పరుగెత్తి పుంజుదగ్గరకు పోయి "ఇది నాది, ఇది నాది" అని ఆమణిని లాగకొని రాజ నగరుకు పరుగెత్తెను.

రాకొమారుడు పోయిన ఒక ఘంట

వరకు పుంజు ఎద ఎద కొట్టుకొనుచు, తల అల్లా డించుచు వెక్కి వెక్కి ఏడ్చుచుండెడు.

„కొ-కొ-కొ, ముక్కు నందుండు మణిపి-మ-మ-ణిపి-పీ-పీకుకొని పోయెను" అని అరచుచు .పుంజు ఇంటికి వెళ్లెను.

ఇంటియందుండు కుమ్మరి పుంజు రాలేదని ఎదురు చూచుచు ఇటు నటు తిరుగు చుండెను., ఇంతలో వచ్చిన పుంజును జూచి „ ఏ మి సే దు తెచ్చితివి? ఎందుకింత ఆలస్యము?" అ ని ఘర్జించెను.

పుంజు భయపడినది. మాటాడ లేదు. అయిన „ము-ము-క్కు నందు" అనిఊరకాయెను

తిరిగి కుమ్మరి గట్టిగా అడిగెను. దానికి బదులు రాలేదు. అతడు కోపముతో „ తెల్ల వారపోయిన నీవు ఇంతసేపువరకు వెదకి ఏమియు లేక వచ్చినదే కాక తిరిగి మాట్లాడకున్నావు.

తక్షణమే వెళ్ళి ఏమైనను తేవలసినది. లేని ఎడల నిన్ను చంపివేిందును." అనెను.

ఆమాటలువిని పుంజు మారు మాటాడ లేదు. అక్కడినుండి ఎక్కడికో పోయెను. పోవు దారి యందు ఈలాగు అనుకొనెను. "నేను మణిని తేక యింటికి పోవుటకు వీలులేదు. రాజ గృహ మార్గము తెలియదు. ఎవరిని అడుగ వలెను" ఇంతలో పల్లికి మోసిన బోయీలకాలి గుర్తులు కన పడెను. దానిని చూచి పోవుచు "నా మణిని ఇవ్వండి" అని అరచెను ఇంతలో చీకటి ఆయెను. పుంజు అక్కడ నిలచెను.

అప్పుడు ఒక సందునుండి ఒక చిన్ననక్క బయటికి వచ్చి, "అదిఎవరు? కొ-క్కొ! ఎక్క డికి" అని అడిగెను.

పుంజు- ముక్కు నందు మణి వుండెను. పల్లకిలో రాజుండెను. పల్లకిలోని రాజుముక్కు

నందలి మణిని పీకుకొని పోయెను. దానిని తెచ్చుట ఎట్లు?"

నక్క:- నేను వచ్చి రాజుతో మాట్లాడనా?
పుంజు:- రమ్ము నా రెక్కలలో దూరి హాయిగా కూర్చుండుము. నేను మోసుకపోదును.

రెక్కల క్రింద పుంజు నక్కను దూర్చుకొని, కొక్కొక్కో యని కూయుచు ముందు పోయెను. ఆ అడవిలోని తోడేలు ఆకూతను విని "ఎవరది! కొక్కొక్కో ఎక్కడికి?" అని విచారించెను.

పుంజు తనమణి పోయిన రీతి చెప్పెను. తోడేలును రమ్మని పిలిచెను. తన రెక్కలలో దాచుకొని పుంజు ముందుకు నడచెను.

దారియందు పాతమారెమ్మ గుడికలదు. ఆగుడిమీద విరాద గడ్డి మొలచియుండెను. గడ్డి పెరుగుటకు మిద్దె ఎక్కుటకు నిచ్చెన యొకటి

యుండెను. ఆనిచ్చెన పుంజును చూచి ,,ఎవర
క్కడ_కొ_కొక్కొ_కొక్కొ ఎక్కడికి" అనిఅడిగెను

పుంజు- ,,నాముక్కు నందున్న మణిని పగ
డాల పల్లకిలోని రాజు పెరుకుకొని పోయినాడు.
నాకు సహాయము చేయుము" అని అడిగెను.

నిచ్చెన;_ ,,నేనునీ వెంబడి వత్తును నీకు
సహాయము చేతును" అనిచెప్పి చిన్నదాయెను.
దానిని పుంజు తన కాళ్లమీాద ఉంచు కొని
ముందు నడచెను.

దారియందు ఏనుగుల చెరువుండెను. ఆ
పుంజు ఆరవువిని ఆచెరువు నీరు పైకెక్కివచ్చెను.
ఆపుంజు కథనువిని నీరు తాను కూడ పోవ నిశ్చ
యించెను. అది చిన్న నీటి చుక్క ఆయెను.
పుంజు దానిని తన నాలుక మీాద నుంచు కొని_
కొ-కొక్కొ_కొక్కొ అని కూయుచు.ముందు వెళ్ళెను.

దారిలో నాలుగు ముఖముల బసవుని

గుడికలదు. దాని ఎదుట రాతి స్తంభ మొకటి కలదు. దానిమీద తేనెటీగల గూడు కలదు. ఈపుంజు కూతనువిని తేనెటీగల రాణి. “ఎవర కడ? కొ.కొక్కొ-కొక్కొ, ఎక్కడికి” అనిఅడిగెను

ఆకథను పుంజు, రాణి ఈగకు తెలిపెను. రాజుఇంటికి పోను రాణిఈగ సమ్మతించెను రాణి ఈగ పుంజు నెత్తి మీద కూర్చొనెను. పుంజు కొ-క్కొక్కొ-క్కొక్కొ అనికూయుచు ముందునడచెను.

ఈ విధముచ పుంజు, ఒక రెక్కక్రింద నక్కయు, ఇంకొక రెక్కక్రింద కోడేలు, కాళ్ల మీదనిచ్చెన, నాలుకమీద నీటి చుక్క, తల మీద తేనెటీగను మోసుకుని బసవ్వ గుడి నుండి దిగి, ముందుపోయి, గౌరవయ్య కొండఎక్కెను.

కొండ మీది గౌరవయ్య దేవుని చుట్టు, మూడు సార్లుచుట్టి నమస్కరించి, “గుడు గుడు గౌరవయ్యా, నామణి నాకు దొరకిన జాముకొక తూరి సిన్ను ధ్యానింతును. అరవై ఏండ్ల కొక

పోరి నీజాతరకు వచ్చెదను." అని నేనుకొనెను.

అక్కడి నుండి రాజ గృహము చేరెను. రాజు దర్బారు చేయుచుండెను. దీనిని మన పుంజు చూచెను. అతడు బంగారు సింహాసనము మీద కూర్చొని యుండెను అందరు చేతులు జోడించి నిలబడి యుండిరి. ఇదంతయు చూచి పుంజు భయపడి పోయెను. కాళ్లు వణికెను. నోరు ఎండియుండును గాని, నోటి యందుండిన నీటి చుక్క వలన నోరు ఆర లేదు.

పిమ్మట ఆపుంజు రాజును చూచు "కొక్కొ-కొక్కొ- ముక్కులోవున్న మా మణి ఇవ్వండి" అని అడిగెను. రాజు నవ్వెను. పుంజు తిరిగి అరచెను. మళ్లి కూసెను దానితో రాజు కోపపడి "ఈకోడిని కోళ్లగూటిలో చేర్చండి." అని ఆజ్ఞాపించెను. తక్షణమే రాజ సేవకులు పుంజును కోళ్ల గూటిలో వేసిరి. ఆగూటి యందు అనేక కోళ్లు ఉండినవి. అవి ఈకొత్త పుంజును పొడుచు

చుండెను.

అప్పుడా పుంజు "నక్క బావా నక్క బావా! రెక్కల నుండిరా. వచ్చినన్ను కాపాడు" అని అడిగెను.

అది విని పుంజు కొక ప్రక్కన గూర్చున్న నక్క త్వరలో బయటికి దుమికి అకోళ్ల న్నిటిని తిని అడవిచేరెను.

మరు నాడా సేవకులు కోళ్లకు గింజలు వేయరాగా ఆగూటిలో కోళ్ళే లేవు. ఆపుంజు మాత్రము ఎగిరి రాజ భవనమునకు పోయి "కొ-క్కొ-క్కొ-ముక్కులోని మ-మణిని యివ్వండి" అని అరచెను.

ఆరాజు, పుంజు కూతవిని కోపపడి "దీనిని గుర్రపు లాయములో వేసి గుర్రములతో తొక్కించండి" అని ఉత్తర్వుచేసెను.

ఆమాటలు విన్న తక్షణమే పుంజును పట్టి గుర్రపు లాయములో వేసిరి. గుర్రములు దీనిని తొక్కవచ్చెను.

అప్పుడా పుంజు "తోడేలు మామా బయటికి వచ్చి నన్ను కాపాడుమా" అని బతిమాలెను.

ఇది విని పుంజు యొక్క మరొక రెక్క క్రింద వుండిన తోడేలు బయటికి వచ్చి లాయములో వుండిన గుర్రము లన్నిటిని చంపివేసి అడవి చేరెను.

మరునాడు గుర్రపు వాండ్లు తమ తమ గుర్రములను చూడబోగా అక్కడ గుర్రములు లేవు. పుంజు మాత్రముండెను.

తక్షణమే పుంజు రాజ గృహము నకు పోయి కొ-క్కొ-క్కొ నా ముక్కున నుండిన మాణిక్యము ఇవ్వండి అని అరచెను.

దానిని విని రాజ కొమారుడు కోప పడి సేవకు నొకని పిలిచి ఈ పుంజును ఒక గుంతలో పార వేయుము. అట్లయినగాని దీని పొగరణగదు అనెను. సేవకుడట్లే చేసెను. పుంజు ధైర్యము వదలక నిచ్చెనను దలచుకొని ,,నిచ్చెన మామా! నాకు తోడు రమ్మా" అని బతిమాలెను. అంత తన కాలిపై నుండిన నిచ్చెన పెద్దదై గుంతపై భాగమునకు పుంజు యొక్కట కనుకూలము చేసెను. పుంజు నిచ్చెనపై కెక్కి వచ్చినది. పుంజు రాజు ఎదుటికి మరల పోయి నా మణిని ఇవ్వండి యని అడిగెను.

రాజు పుంజును జూచి మరింత కోప పడెను. ,,ఏమిది? ఎచట పెట్టించినను మరల మరల వచ్చి నన్ను తొందర పెట్టు చున్నది. గనుక రాచ నగరులో నొక, యెత్తయిన గోపురమున పార వేసి రమ్మని ఒక సేవకుని రాజు నియమించెను. సేవకుడట్లే చేసెను.

పుంజుకు చాలా విచారము కలిగెను. అపకలు తొలగలేదు ఇప్పుడు ధైర్యము విడువ కూడదు. నామిత్రుడైన నీటిని తలచెదను. అని నీటిని తలచుకొనగా అది ప్రత్యక్షమయ్యెను. రాచనగరు మునుగునట్లు పుంజు నీటిని వేడుకొనెను. రాజ నగర మంతయు నీటిలో తేలుచుండెను. రాజ కుటుంబములోని వారందరును చాలా అవస్థ నుండిరి. అయినను మణి ఇవ్వలేదు. రాజు తన మూర్ఖత్వమును విడువడు. కాని పుంజేమి చేయగలదు? రాజకుటుంబపు పనివాళ్ళ అవస్థలచూడ లేక నీటిని తగ్గి పోవు నట్లు వేడుకొనెను.

నీరు క్రమముగ తగ్గిపోయెను. మణి ఇంకను దొరకలేదు. ఏమి చేయవలెనని పుంజు చింతించు చుండెను.

ఇంతలో దాని కొక ఆలోచన కలిగెను. ఇంకను తేనెటీగ కలదు కదా. దాని సహాయ

మున ఈపని సాధి,చవలెనను కొనెను.

పుంజు తేనటీగను తలచుకొనెను. ఈగ పుంజుతలపై నుండి ఎగిరి నేరుగా రాణి ఇంటికి పోయి ఆమె ముక్కును కరచెను. రాణి ఆకాటును భరింపలేక కుయ్యో మొర్రోయని యేడ్వసాగెను. రాజు, భార్య యొక్క అవస్థను చూడ చాలక మణిని పుంజున కిచ్చి వేసెను.

పరమానందముతో పుంజు ఆమణిని తీసికొని. రాజ నగరు విడిచి తన పరివారములతో వాపసు వచ్చెను. యజమానుడగు కుమ్మర సంగప్ప మణిని చూచి సంతోష పడెను. తన కు సాయపడిన పరివారముల తాపిదువ జాలక వానిని తన దగ్గర నుండు నట్లు ఏర్పాటు చేసెను. కాలిమీదిగీట్లు నిచ్చెనవి. తల మీది జుట్టు తేనటీగది అని చెప్పెదరు.



# "ఉపాయముగల తాబేలు"

ఒక దట్టమైన అడవి యుండెను. అందు సింహములు పులులు, ఏనుగులు, మొదలగు జంతువులుండెను. ఎక్కడఁ జూచినను సెల యేరులు పారుచుండును. అన్ని విధములయిన పండ్లను, పూలను నిచ్చు చెట్ల చేత నా చుట కందముగ నుండెను.

ఆయడవి కంతకను మృగరాజు రాజయి పరిపాలించు చుండెను. ఎప్పుడును ఏమృగము నతను నెట్టితొందర లేకుండునటుల నా మృగ రాజు రాజ్యమునేలుచుండెను.

ఇట్లుండ నొకనాడు వేసవిని పగలు పం డ్రెండు గంటలవేళ ఒక మదపుటేనుగు ఎండవేడి మికి తాళఁజాలక ఒక నదిలో దుమికెను. నది అంతయు అల్లకల్లోలమాయెను. ఆనది యందొక

తాబేలుండెను. దానికి మిక్కిలి కోపము వచ్చి "అయ్యా, నీవు గొప్ప జంతువవైన మాత్రాన నేమి ఫలము? హాయిగ నీ యెండ ప్రొద్దున నీటి యందు నిదురబోవుచున్న నాకు ఊరక లేని తొందర కలుగజేసితివి. మొదటి సారి కావున క్షమించితిని. ఇక ముందెప్పుడును రాకుము" అని యనెను.

వెంటనె ఏనుగునకు మరింత కోపము ఎక్కువయి ఇట్లు పలికెను. ఓ తాబేలా! నీవా చిన్న జంతువవు నా బలమునకు నీవు తాళగలవా? నన్ను అనుటకు నీకేమి అధికారము? ఊరకుంటివా సరి! లేకున్న నిన్ను చంపెదననెను.

కొంతసేపు వాదులాడి ఆ రెండును ఇట్లు ఒక పందెమును వేసికొనినవి. ఒక పొడవైన గట్టి పగ్గము తెచ్చి ఒకకొన ఏనుగు మెడకును, వేరొకకొన తాబేలు మెడకును గట్టవలెను. ఏనుగు ఒడ్డునను, తాబేలు నీటి యందును నిలు

వంబడి లాగవలెను. అప్పుడు దేనికి బలము ఎక్కువ ఉండునో అది గెలుచును. ఓడిపోయిన జంతువు గెలిచిన దానికి అడవిని గల ఫలముల నన్నింటిని కానుకగాఁ దెచ్చి యిచ్చుటయె కాక ఎప్పటికిని తాను గెలుపొందిన దానికి బానిసయై యుండవలెను. అని తీర్మానించుకొనిరి.

ఈసంగతి రాజునకు దెలిసెను. ఆయడవి జంతువుల కెల్లను దెలిసెను. అందఱును గుమిగూడిరి. న్యాయమును తీర్పు చెప్పుటకు పెద్దల నేర్పాటు చేసిరి. వెంటనె యొక వగ్గమును దెచ్చి రెంటి మెడలకును గట్టిరి. అవి కొన్ని విధములుగ నొకటి నీటియందును మరొకటి యొడ్డునను పిలిచినవి. చూపరులకందరకు ఏనుఁగే గెలుచునని గట్టి నమ్మకము గలిగి యుండెను. జంతువులన్నియు నీవింతను జూచుటకు క్రిక్కిఱిసి యుండినవి.

వెంటనె యొకగంట మోగెను. లాగుట

కారం భయమాయెను. రెండును తమకున్న బలము నంతను జూపుచు లాగుచుండెను. అప్పుడు పటక్కున పగ్గము తెగెను ఏనుగు క్రిందబడి ముఖము పగిలెను. అందరును చప్పటులు గొట్టిరి. ఏనుగున కవమాన మాయెను. తాబేలునకు జయము గల్గెను. రాజునకు గూడ గొప్ప సంతోష మాయెను. నా రాజ్యమున గూడ నిట్టి బలము గల వారున్నారుగదా యని మెచ్చుకొనెను. తానును ఆ తాబేలునకు బహుమాన మియ్య వలెనని పిలిపించెను అప్పుడు తాబేలును రహస్యముగ నడిగెను. ఓ తాబేలా! నీవు నిజముగ నేనుఁగును గెలిచితివా? లేక యేమైన నిందు యుపాయము గలదా? తెలుపుమనెను. “క్షమించెదమన్న విన్న వించెదవనెను, ఆట్లే కానిమ్మని రాజు పలికెను. తాబేలు “రాజా! నీటిలోపల యొక రంధ్రమున్నది. దానినుండి యవతలి యొడ్డునకు మార్గమొకటిగలదు. ఆ మార్గమును బట్టిపోయిన ఎడల అడవివచ్చును. అందలి యొక పెద్ద చెట్టునకు

సేనావర్గమును గట్టియుంటిని. కావుననే నాకు జయముగల్గెను" అని చెప్పగా నా తాబేలు యుక్తికి రాజుసంతసించి, కానుక నొసంగెను.

పిమ్మట తాబేలు కీర్తి ప్రపంచ మంతయు నిండెను. జంతువు లన్నియు ఓర్వ లేకుండెను. కాని చేయుటకే విధమయిన ఉపాయము తెలియనిదై యుండెను.

ఇట్లుండు నీటి గుఱ్ఱమొకటి తాబేలు దగ్గరకు వచ్చి ఏనుఁగును గెల్చితినని చాల గర్వించుచున్నావు. నన్ను గెలిచినగదా నీబలము బయట పడునని పలుకగా నాతాంబేలు తప్పక గెల్చెదననెను. తోడనే అందరిని పిలిపించిరి. ఈవిధముగ పందెమును నిశ్చయించిరి.

నది యందొక చోట ఉభయులు మునగవలయును. మునిగినచోటుకు ఇరువది గజముల దూరములలో ముందుగ నవడు తేలునో వాడు బలశాలి. వాడే గొలుపు పొందిన వాడు అని

నిర్ణయించిరి.

వెంటనే గంట మ్రోగెను. ఆ రెండును ఒక చోట మునిగినవి. అందరును ఆశ్చర్యముతో చూచుచుండిరి. గుర్రము కన్న ముందు తాబేలు ఆ చోటు చేరి తల పైకెత్తెను. సభవారందరు చప్పట్లుకొట్టిరి. గుఱ్ఱమునకు అవమానమాయెను అప్పుడా గుర్రము ఇంకొకతూరి పందెము పెట్టి నచో తప్పక గెల్చెదను. అంతవఱకు అవకాశ మియ్యవలెనని సభవారిని కోరెను. అందరు సమ్మతించిరి.

మఱి యొకసారి ఆ రెండును మునిగినవి. గుర్రముకన్న ముందే సంకేతస్థలమును తాబేలు చేరి తల యెత్తెను. తాబేలునకు దిగ్విజయము పొందినంత సంతసమబ్బెను. దానికీర్తి దిక్కుల యందంతటను నిండెను. అది మొదలు దానిని చూచి జంతువులన్నియు భయపడుచుండెను

రాజు మరల నా తాంజేలును తన వగరుకుఁ బిలిచి, ఈ తడవ యెట్లు గెలుపు నొందితివో నిజము చెప్పుమని మరల కోరెను. తాబేలు "దేవా! క్షమింపుఁడు చిత గాని నాకు భగవంతుఁడు యుపాయము నిచ్చి నాడు. కాబట్టి జయమును పొందితిని. అదేట్లనగా? నాతమ్ముఁడొకండు నావలెనేయున్నాఁడు. వాఁడొకచోటను నేనొకచోట నుండి మునుగుచు తేలుచునుంటిమి. మాయిద్దరిలోని భేదమును మాతల్లియే కనుగొనలేదు. అట్లుండ నీసభవారెట్లు గుర్తింపఁగలరు? కావుననే నాకు జయము కల్గెను. ఇదియే దేవర హాస్యము!

అంతటరాజు మిక్కిలి సంతసించి ఆ తాబేలు యుపాయమునకు మెచ్చుకొని అనేకబహుమానము లిచ్చి పంపెను.

కావున యుక్తి కలవాడు ఎక్కడనయినను

గెలుచును. ఎంత గొప్పపని యైనను యుపాయ
ముతో సాధింపవచ్చును. దేహబలమున కన్న
బుద్ధిబలమే గొప్పది.



